# గజవిహారము

ఉభయభాషాప్రవీణ, అష్టావధాని,
వడ్డాది సీతారామాంజనేయకవి:

శ్రీరస్తు

ఓంనమః కామే[illegible]

శ్రీ రామ.

# గజవిహారము.


కృతికర్త.

ఉభయభాషాప్రవీణ, అష్టావధాని,

వడ్డాది సీతారామాంజనేయకవి.

(ఖాశింకోట, విశాఖపట్టణము జిల్లా)

పరిష్కర్తలు:

బ్రహ్మశ్రీ

పండిత పురాణం సూర్యనారాయణ తీర్థులవారు.



ప్రథమ ముద్రణము 500 ప్రతులు.

శ్రీఆనంద తీర్థ ముద్రాక్షరశాల,

రామచంద్రపురము

1937





ఈశ్వరశ్రావణి.

మూల్యము, 0—2—0

శ్రీ ర స్తు.

ఓం నమః కామేశ్వర్యై.

# అభినందనము.

శ్రీరామగజవిహారగముఁ । బేరిష్టముతోడ నాంధ్రవిద్యారణ్యో
దారభువి నెఱపె నెంతయుఁ । బేరిమిఁ దోఁట పెదవీరవెంకన

మ. మనమం దీయెడ నెంచకుండఁ గలనా? మాన్యస్వభావుల్, సుమి
త్రుని, నద్దూరిసదన్వయాంబురుహమిత్రుల్, మా జగన్నాథరా
జును, శ్రీమత్కవితాకళామృతరసజ్ఞుల్, నాకు మావీరవెం
కనసుల్ నేస్తముఁ గూర్చి తత్ఫలము వేడ్కన్ గన్న పుణ్యాత్మకుల్.

మ. తగుఁగాదే? హలసంపదం బొదలు సీతారామచారిత్రమి
మ్ముగఁ దెల్గుం గొలమందు భద్రి మొదలన్ ముద్రించుటల్ మాసఖుం
డగు వెంకన్నకు, సీరపాణి; కుపనామార్గమ్ము సార్గమ్ముగా
వెగడన్, స్వీయధనంబు ధన్యమగుమన్ నిత్యమ్ము భాసిల్లఁగన్.

క. వీరనసాధ్వీమణియును, । వీరాస్వామియును వీరవెంకన్నను నో
ల్లాగాఫుఁ గొడుకుగాఁ గని । కీర్తిఁ గొనిరక్లైకరానుఁ గృతిఁ బ్రకటింపన్

శా. రాముల్, శ్యామలమూర్తి నెన్న డెగ నారాధించుచున్ సత్కవి
స్తోమంబున్ బుధలోకమున్ గనుచు దానోత్సాహమ్ము టించున్ దయ
యా మోదమ్మును జూఱఁగొంచు మను భవ్యాత్మున్ సదా ప్రోవుమా
మామిత్రున్ పెదవీరవెంకనఁ గృపన్ మాతల్లి కామేశ్వరీ!

క. కేసరికిశోరలీల ని । భాసురగతి నచ్చుఁగూర్పఁ బ్రబలిన నా సం
తోసమె నామిత్రతతిన్ । శ్రీసంపద్వృద్ధిఁ బెరఁ జేయుత మెపుడున్!

రామచంద్రపురము
ఈశ్వరశ్రావణి.

ఇట్లు మిత్రుఁడు,
వడ్డాది సీతారామాంజనేయకవి.

# గ జ వి హా ర ము.

మ. నను వాత్సల్యముతోడఁ జూచెదు పురాణం-సూర్యనారాయణా
ర్యుని, మత్తీర్థుని, జ్ఞానతీర్థునిఁ, గవితోర్వీదీర్ఘసామ్రాజ్యశా
సను, దేవీసతతాధివాసవిమలస్వాంతాంబుజున్ నాయెడం
దను సేవించెద భద్రసిద్ధికయి సీతారామచంద్రప్రభూ! 6

మ. లలితాకారత నొప్పు నీదుమహిమోల్లాసంబు నీక్షింపఁగాఁ
గల సామర్థ్యము నా కొసంగినగురున్, గారుణ్యసంపన్నునిన్
బలఁతున్ గప్పలవాటువంశజు, జగన్నాథాహ్వయున్ బుత్రవ
త్సలతన్ నన్ను నజస్రమున్ మనుప సీతారామచంద్రప్రభూ! 7

మ. కవితోద్యన్మహితాశ్వమేధమఖదీక్షన్ బ్రహ్మతత్త్వమ్ము భా
గవతోత్తంసుల కిచ్చి, భారతమహాఖ్యాతిన్ వెలుంగించుచున్
శ్రవణానందము మా కొసంగుసుమనశ్చక్రేశులన్ గొల్తు స
ద్భవులన్, దిర్పతివేంకటేశ్వరుల సీతారామచంద్రప్రభూ! 8

మ. వ. సు. రాయాంచితనామధేయు, శుభతత్త్వశ్రీసముద్యత్కళా
ప్రసితున్, సూక్తిసుధానిధిన్, సకలవిద్వల్లోకచూడామణిన్
వసుకావ్యప్రసవార్చితాంధ్రవసుధాప్రారంభు, మద్వంశగం
ధసమీరున్, గవిశేఖరున్ దెలుతు సీతారామచంద్రప్రభూ! 9

మ. ఘను, వడ్డాదిసదన్వయాంబునిధిరాకాచంద్రుఁ, బద్మాక్షమా
నినికిన్ రామయమంత్రికిన్ దనయునిన్, విద్వాంసుఁడౌ తిమ్మరా
జునకున్ శిష్యవతంసు, మజ్జనకు, విజ్ఞున్, విజ్ఞసమ్మాన్యు, జ్ఞా
తనయున్ గొల్చెద భీమశంకరుని సీతారామచంద్రప్రభూ! 10

మ. అతిమాత్రంబుగ మున్ గవీశ్వరులు నీ కర్పింపరే? తారహా
రతతుల్, భాసురభూషణోత్కరము; నారా! త్వత్ప్రభుత్వోన్నత
స్థితి కింతేనిఁ దదంగముల్ వలయుఁగాదే? కాన నీశుంభదా
తతమత్తేభములన్ గ్రహింపు మిఁక సీతారామచంద్రప్రభూ! 11

మ. వివిధశ్రీ లెవి యున్నఁ బూర్ణతను బ్రాపింపంగలేఁ డెన్నఁగా
నవనీశుం డటుగాన నిచ్చితి "గజాంతైశ్వర్య" మన్మాట నా
త్మ విలోకించి నిరూఢతత్ప్రగత నిమ్మత్తేభముల్; త్వన్మహా
త్త్వవిధిన్ మించుము సార్వభౌముఁడుగ సీతారామచంద్రప్రభూ! 12

మ. మును లే రిచ్చిరి నీకుఁ? బత్రిమొ ఫలంబో తోయమో కాక; నేఁ
డనురూపంబుగ నిచ్చినాఁడ భవదధ్యక్షత్వసంవర్ధకం
బని మత్తీర్థకృపాబలాప్తకవితోద్యద్రాజ్యశోభా సహ
ఘ్నన మత్తేభశతంబుఁ గైకొనుము సీతారామచంద్రప్రభూ! 13

మ. జలదశ్యామల దేహుఁ, బుష్కరమనోజ్ఞశ్రీకరోత్సాహునిన్,
విలసద్దానరమావిలాసిఁ, ద్రిజగద్విఖ్యాతసత్త్వోదయున్,
వలఁతున్ నిన్ రఘుపుంజరున్ సతము భద్రస్ఫూర్తి నస్మన్మన
స్థ్సలి సంచార మొనర్చి యుల్లసిల సీతారామచంద్రప్రభూ! 14

మ. అనురాగంబు ఘనంబు నీ కెపుడు వేదండంబునున్ నక్రబా
ధను నిర్మూలము చేసి బ్రోచితివి కాదా మున్నె? భక్తాళితో
ననుబంధం బది నీకు రూఢ; మిఁక నాయందు దయన్ నించి, నన్
దనియన్ జేయుము నాకు కాన్కఁ గొని సీతారామచంద్రప్రభూ! 15

మ. మును గోదావరి చెంగటం దిరుగుచో భూజాతయున్ నీవు మీ
కనవేడ్కన్ గరిణీకరేణువులఁ బేర్మిం బెంచి, లాలించి, పెం
డ్లి నొగిం జేసి వినోద మందితిరి; తల్లీలాప్తి మద్దత్తనూ
తనమత్తేభశతమ్ము దాఁ గొలుపు సీతారామచంద్రప్రభూ! 16

మ. భవభూతిన్ గవి పోతనన్ మనుప వే? భవ్యానుకంపాసుధా
సవనోద్ధర్షము పేర్మి, నీ కిరువు రుత్సాహాప్తి మత్తేభవ
ర్యవిలాసోద్ధతిఁ గూర్చినందులకె; నే నంబారి నెక్కించి యు
త్సవముం జేయుదు; నెట్లు నన్ మనుతొ? సీతారామచంద్రప్రభూ! 17

ఉ. శ్రమమం బొందినపిమ్మటం గద కరిన్ రక్షించినా వందురో,
నిమిసం బైన విలంబ మోర్వ నిఁక; నా నే నీ కృపేక్షించుటల్?
సమయం బయ్యె, గజావలోకనమె శస్త్రం బన్న నీ కిచ్చు టు
త్తమమే కాదె? తఱిన్ ననున్ మనుపు సీతారామచంద్రప్రభూ! 18

మ. “సమదస్ఫూర్జితశాత్రవానుచరసంగప్రమోదం బె కా
క మహిన్ సత్కృతి కబ్బునే? కొలఁకనుల్ కాంతాకటాక్షంబు?
ట్టిమరన్ గడ్సగజంబు లిచ్చు నితఁ” డం చాశ్చర్యమా? మాప్రభు
త్వమునన్ లో కేది? శ్రీ వినాగ నిఁక సీతారామచంద్రప్రభూ! 13

ఉ. సితదంతావళిధాటికి న్నాఁగుటు కహో! స్వేచ్ఛాప్రకాశుండు, న
ప్రతిమానుం డొకరుండు కాపలయుఁ దగ్రోద్ధతిన్ వివేకించి యుం
కితము న్నేసెను వీని నీ కిపుడు, తత్క్రీడావిలాసమ్ము లా
ప్తతమై ఁ గన్గొనుచున్ విరాజిలుము సీతారామచంద్రప్రభూ! 20

మ. గురుధైర్యాంకుశసంప్రయోగమున నీకున్ లొంగి వర్తింప స
త్వరగతిన్ నిగ్రహశక్తిశృంఖలను విద్యుత్ప్రభాదీప్తిఁ దృ
ప్త గణాంగణమునన్ మదాత్మగజమున్ సంధించి బంధించి యా
త్తనిష్ఠైనన్ జలియింప నియమము సీతారామచంద్రప్రభూ! 21

మ. అనివార్యత్వరఁగ న్నెలెదన్ బఱచి యత్యాయాసముం బొందు నా
మన మన్ హస్తిని భక్తిరజ్జుపటిమన్ బంధించుచున్ నేర్పుగాఁ
బునరావృత్తివిహీనసుస్థిరపదంబుం జేర్పవే త్వద్విభు
త్వనిరూఢోన్నతి సార్థమై పరఁగ సీతారామచంద్రప్రభూ! 22

ను. తరణీందుల్ జయఘంటలై యిరుగడన్ దళ్కొందఁ, గాలాభ్రముల్
బురుడింపం దగు గంధసింధురముపైఁ బొల్పొంది, ఘంటికల్ చాల్
తఱచై యాదల నొప్ప, శివమెయి, సీతన్ బావనిం గూడి, త్వ
త్పరమాత్మద్యుతి నింపవే జగతి? సీతారామచంద్రప్రభూ! 23

మ. నిను సేవించుట, నీమహామహిమముల్ నిత్యమ్ము వర్ణించు, టె
ట్లనిశో నాకుజునట్టిధన్యునకు సంప్రాప్తించునే కాని వ్య
ర్థున కెట్లబ్బును? బ్రహ్మ, శాసనము సంరోధింప కీఁగల్గినం
తనె యా నారదు లౌదు రెల్లరును సీతారామచంద్రప్రభూ! 24

మ. శ్వపచుం డైనను మోక్షముం బడసె నావాల్మీకి నీనామముం
జపముం జేసియె, యంతె కాక కవితాసామ్రాజ్యపట్టాభిషే
కపుసద్గౌరవ మందె నాదికృతి కాఁగా నీకథల్ వ్రాసి; మో
దపదౌన్నత్యని యంత వీవు కద సీతారామచంద్రప్రభూ! 25

మ. కవు లన్నన్ విహగమ్ము లన్ప్రియమునం గారుణ్యముంబూని ప్రో
తువు నీ వెచ్చదు వామలూరుభవుమాధుర్యంపు "రామ్ రామ్" [illegible]
రవ మాలించి ప్రహృష్టతం గవికవప్రఖ్యాతిఁ బొందించి త
ద్భవము న్సార్థకముం బొనర్చితివి సీతారామచంద్రప్రభూ! 26

మ. ఎద వాల్మీకి మహాకవిన్ దలపఁగానే గొబ్బునన్ గోచరిం
చెద రాభాస్కరపాపశాజసుకవిశ్రేష్ఠుల్ స్వజాతీయసం
పద సొంపొందెను నీదుదివ్యచరిత న్బాగొప్పఁ జేపట్టి; త
త్పదమాహాత్మ్య మనన్యసాధ్య మగు సీతారామచంద్రప్రభూ! 27

మ. నరులున్, వానరులున్, విహంగములు, నానాజాతులున్ బాడు నీ
వర"చారిత్రము, నెవ్వ రెన్నిగతులన్ వర్ణించినన్ ద్రాలదే!"
సరసాలాపపటుత్వ ముంటయె నీసంకీర్తనంబే మహ
త్తరభాగ్యం, బటు కానిచో వృథయె సీతారామచంద్రప్రభూ! 28

మ. మునుమున్ దిక్కనమంత్రి నీదుచరితమ్మున్ వ్రాయుటన్ గాదె పా
వనసూక్తినితోడ నొప్ప విరచింపన్ బంచమామ్నాయ మెం
దెన లేనట్టి మనోహరాంధ్రకవితాహేలాసమారూఢిఁ; ద్వ
ద్గుణకారుణ్యము భక్తహర్షదము సీతారామచంద్రప్రభూ! 29

మ. 'ఏకతారిన్' గొని త్యాగరాజకవి నిన్నే యాంధ్రగీతప్రబం
ధకలాపంబులఁ బాడె, గింగురుమనెన్ దన్నాదలేశమ్ము నే
టికి మా వీనుల! గాఢమై నిలిచె మాడెంగాన నీదివ్యత
త్త్వకళాపాదక మైన తత్ప్రతిమ సీతారామచంద్రప్రభూ! 30

మ. తులసీదాసునభంగవాక్సుధలలోఁ దూఁగాడు నీలీల యు
జ్జ్వలనానావిధకావ్యనాటకలసత్సారస్వతస్ఫూర్తి ని
చ్చలు దీపించియుఁ జాలు నన్ దలఁపు నించంబోవ దెవ్వారికిన్;
దలఁపన్, బల్కఁగ, నెంచ శక్యమొకొ? సీతారామచంద్రప్రభూ! 31

మ. కవయిత్రీమణి, మొల్ల మొల్లమగు నేర్పున్ మొల్ల నెత్తావి వె
ల్లువతోడన్ శబరీసమర్పితఫలాళుల్ చిందుక్రొందేనె లు
ద్దవిడిన్ మిశ్రముచేసి నింపె జగతిన్ ద్వత్రాప్తభవస్ఫూర్తిఁ; ద
ద్భవమే సార్థక, మొల్ల దైహికము సీతారామచంద్రప్రభూ! 32

మ. ఘనభక్తుం డని రామదాసు, ననఘున్, గంచెర్ల-గోపన్న నీ
వనుకంపన్ గని బంధముక్తునిగఁ జేయన్ దీక్షఁ గొన్నట్లె దీ
నుని నన్ సంసృతిబంధనాకులత నెందుం బొందనీకుండ బో
ధనముం గూర్చి తరింపఁజేయఁగదె సీతారామచంద్రప్రభూ! 33

మ. పరమార్థమ్ము గణింప నిర్గుణపరబ్రహ్మంబ వీ వయ్య; ని
ర్భరచైతన్యము నీవుఁ గల్గెఁ బ్రకృతిన్, భామామణిన్, జానకీ
తరుణిం గూడఁగ; హర్షదం బగుఁగదా దాంపత్య! మ ట్లౌట నే
తరుణీయుక్తుఁగఁ గొల్చుచుంటి నిను సీతారామచంద్రప్రభూ! 34

మ. పదునాఱేండ్లకె తత్త్వబోధమున జీవన్ముక్తిఁ గైకొంటి నీ;
వని శ్రీతీర్థవరప్రసాదమ, పస్త్రిష్షద్భాషమ్ము యాఁ
గట! సంసార మసార మన్ మతి సుసాంగత్యమ్మునన్ గాక పొం
దఁ దరంబౌనె మహర్షి కేచందమున? సీతారామచంద్రప్రభూ! 35

మ. అతిభక్తి న్నినుఁ గొల్చి మున్నహహా! త్ర్యక్షస్థానంబుల్ శుభ
స్థితియు న్మోక్షపదంబు నొందఁగ, నరుల్ తెల్పొందియుం బ్రాప్య మూ
ర్ఖతమై నీశుభనామముం దనివిఁ దీఱ న్నార నోరార ను
ద్యతభక్తిం బగఁ బల్కరో రకట! సీతారామచంద్రప్రభూ! 36

మ. వెడలం, దుండఁడు, ఖేదముం గొనఁ, డభీప్సింపండు, వీడండు, చే
యఁ డెదేనిం, బరిణామ మొందఁ, డచలుం, డానందరూపుండు, రా
ముఁడు మాయావృతుఁ డౌట నట్లె తనరుం బో యంచు, సలీల, సం
దడితోఁ జాటెఁ ద్వదీయతత్త్వమును సీతారామచంద్రప్రభూ! 37

మ. తను వన్పంజరమందుఁ జిక్కుకొని తీక్ష్ణప్రాప్యతత్త్వప్రభో
ధన మన్నత్ఫలసిద్ధి నొంది యెటో యాత్మక్షయ్యతకీరంబు నీ
ఘననామస్మరణంబుఁ జేసెను నిదే! గారానఁ దిప్పింపవే
తనియ న్నినుముద్దుఁజక్కెరలు సీతారామచంద్రప్రభూ! 38

మ. అరివిధ్వంసక, మాగమార్చితము, బ్రహ్మర్ష్యైకజప్యంబు, దు
ర్భరదారిద్ర్యమహాబ్ధిపోతము, శరీరత్యాగకాలమ్మునన్
స్మరణీయం, బగదంకరంబు, ఘనసంసారాటవీదావ మె
త్తఱి నీనామము; సంస్మరింతు నిఁక సీతారామచంద్రప్రభూ! 39

మ. వెలికిన్ బర్విడు లోనిపాపములు తెల్వన్ 'రా'యనంగానె, 'మా'
తలుపుం బోలెఁ బ్రవేశ మీయక పడున్ దప్పమ్ముతో వాని న
వ్వల నడ్డుం; బదునాల్గులోకములుఁ గైవల్యమ్ము నొందంగఁ జి
త్కల నిక్కమ్ముగ నద్దియే తలఁప సీతారామచంద్రప్రభూ! 40

మ. జననీగర్భగతుండవై వనరుచో సంరక్ష మున్ జేసి త
న్నిన నీకారుణికత్వ మెం దఱిగెనో నేఁ డేమొ నాపైఁ బె నీ
ర్ఘృణ సాధింపఁ గడంగితీ వకట! కౌసల్యాగతిస్తన్యముం
దనియం గ్రోలిననీకు మేలె యిది? సీతారామచంద్రప్రభూ! 41

మ. ఇనవంశంబను నాలవాలమున నీ వింపొంద జన్మించి, య్యా
జనకాధీశకుమారికాలతను నిచ్చల్ ప్రాపుగా నుండి, నీ
యనుజుల్ శాఖలుగాఁగ నొప్ప, నసుకోద్యద్దీప్తి మారంగఁ గాం
తను మమ్మింతు సురద్రుమంబ వయి సీతారామచంద్రప్రభూ! 42

మ. ధరణీజామృదుసుందరాంగవిలసద్బాహుద్వయీశాఖలం,
బరవిజ్ఞానసుమవ్రజంబును, మహానందామృతాంచత్ఫలో
త్కరమున్ రాజిలఁ గల్పవృక్ష మగునిన్ గల్యాణదాయిన్ నిరం
తరమున్ నెమ్మదిఁ గొల్చుచుండెదను సీతారామచంద్రప్రభూ! 43

మ. వరకల్యాణమహామహంబును, లసత్పట్టాభిషేకంబు, భా
సురవాసంతమహోత్సవంబు ధరలో శోభిల్లఁగా నీకుఁ ద్వ
ద్వరనామాంకితు లెట్టు లుండిరొ వెసన్ వ్యత్యాస మీక్షించి పే
దఱికం బేటికిఁ బాప వింకయిన? సీతారామచంద్రప్రభూ! 44

మ. గురువాక్యప్రతిపాదనప్రతిభ, సత్కోదండపాండిత్య, ము
ద్ధురశాంతంబు, సుశీలరక్తి, స్వసతీతోషానుభోగంబు, స
త్కరుణాపాంగవిలోకనవ్రతము బోధం జేయు నంచు న్నిరం
తరము న్నీచరితమ్ము నెన్నెదను సీతారామచంద్రప్రభూ! 45

మ. దురహంకారము, దుఃఖముల్, దురితముల్ దూరీకృతం బయ్యె, నా
దురదృష్టం బురలెన్, దురుక్తు లెడలెన్, దోషంబు లీఁగెన్ భవ
చ్చరితంబు న్మననం బొనర్పఁగ మహైశ్వర్యక్రియల్ పెక్కు స
త్వరతం జొప్పడు నీమహత్త్వమున సీతారామచంద్రప్రభూ! 46

మ, ఘనతత్త్వాకృతి వయ్యు నీచరిత ముత్కంఠన్ జనుల్ దర్పణం
బునుబోలెం గొన విశ్వనాటకము సమ్మోహాత్మకప్రక్రియం
బొనరం జూపితివయ్య; నీవగుభవంబుం, బెండ్లియున్, వంశవ
ర్ధనరాజ్యక్రియ లెల్ల వింత లగు సీతారామచంద్రప్రభూ! 47

మ. గురుధిక్కారముఁ జేయువారిని నిషేధుల్ గా నొనర్పంగ మున్
శరసంధాన మొనర్చి తాటకను విశ్వామిత్రునాజ్ఞన్ ద్రుగన్
బోరఁగొన్నాఁడవు కాంత యన్న నిశ్చయంబుం బొంద కానా హృదం
తరమందుం బినవాఁటనే యుద్రుగ! సీతారామచంద్రప్రభూ! 48

మ. క్రతువుం గావఁగ? ధర్మకర్మరతి ముఖ్యం బంచుఁ జాటంగఁ ద
త్ప్రతిపక్షాసురపంక్తిఁ గూలిచి, నిరాతంకంబుఁ గావించి, సా
ధుతతిస్తోత్రము లంది మించుచు నహో! దుర్మార్గనిర్మూలనో
ద్యతదీక్షాసమభారభాగ్గవి సీతారామచంద్రప్రభూ! 49

మ. కఱకా తాయియె నీదుపద్రజము సోఁకన్ సుందరీరత్నమై
వెలసె న్మాయురె! నేఁడు మానిలయముం బట్టాభిరామోన్నతి
న్గణింపం దొరఁకొన్న నీనియతిఁ బల్కన్నేలె? మత్పుణ్యస
త్పరిపాకం బిదిగాక నిక్కముగ సీతారామచంద్రప్రభూ! 50

మ. శివచూడామణియై, పవిత్రుఁ డయి, వాసింగన్న చంద్రుం డహో!
భవదాఖ్యాకలన న్విరాజిలెడు సద్వర్ణాభిధానంబుతోఁ;
నవునాఁ ద్వత్కరుణాసుధాలహరిఁ దోఁగాడంగ గండ్రాయియున్
ధవళాజ్జేక్షణయై యొసఁగుఁగదా! సీతారామచంద్రప్రభూ! 51

మ. జనకుం డుంకువ నెట్టు శంకరమహాచాపంబు ము న్వంచి, యీ
జనకుండు, జ్జననుల్, వసిష్ఠుఁడును, విశ్వామిత్రుఁడుం దక్క స
న్మనులు, న్నృపశ్రియుం జెలఁగఁగ శాతత్పూర్ణేందుబింబాస్య, సీ
తను జేఁబట్టితి వౌర! నీమహిమ! సీతారామచంద్రప్రభూ! 52

మ. దురహంకారము చెల్ల దన్నియెడలన్ క్రుంగుం దుదిన్, భార్గవుం
డురుకోశంబున నిన్నెదిర్చియును జిత్రోద్రేకము న్మాని తా
నరుగండోక్కన్ స్వవంచితుం డగుచుఁ; గృత్యాకృత్యముల్ నేరమిన్
న్నర మే మోసము దాఁట నెవ్వరికి? సీతారామచంద్రప్రభూ! 53

మ. పరమం బౌఁజూచు స్వార్థము న్విడిచి విశ్వశ్రేయముం గోరు; టీ
శ్వరమోద్దేశమె యవ్వసిష్ఠుఁడు భరతావనీ స్వరాజ్యాభిషే
కరతిం గట్టినకంకణంబున మహోద్గాఢంబుగాఁ దోఁచు; ని
ద్ధరణి న్నీయవతార మిందులకె సీతారామచంద్రప్రభూ! 54

మ. శతవృత్తిన్ నృపనాయకారులు ప్రజాస్వాతంత్ర్యము న్మాపఁగా
హితముం బూనిరి; సామ్యవాది వగునీ వాదొప్పగ్యము న్మాపి, చి
న్మతముల్ నిల్పి, ప్రజాప్రభుత్వవిజయామ్నాయాంచితోద్గ్రంథ స
త్ప్రతనాశంబము నింపు మెల్లెడల సీతారామచంద్రప్రభూ! 55

మ. అకలంకం బగుసోదరత్వ మది మీయందే నిరూఢమ్ము, కా
వున నిన్నంపినయా మెనంచనున కానందమ్ము సంధిల్లఁ బా
దుక లీవిచ్చితి, వాతఁడుం గొలిచె నీతోనే జగం బంచు, నొం
దక భోగమ్ములు భక్తవర్యుఁ డయి సీతారామచంద్రప్రభూ! 56

మ. అడవుల్, కొండలు మెట్టి నీచరణదివ్యాంభోజముల్ నైఁచె రా
యిడి, కత్తావులకంటె నాహృదియె తా నిక్కట్లు నేఁ డెవ్విధిన్
బడుచున్నన్ మృదు వౌర! యెప్పడుకైనన్ సాటి గాకుండునే?
తడ వేలా? యిట నింకఁ గాల్నిలుపు సీతారామచంద్రప్రభూ! 57

మ. వనవాసంబున కేఁగునప్పుడు భరద్వాజుండు కండంబులే
టిన నీ కిచ్చె, నయోధ్య ప న్మరలువో దివ్యంబుగా విందులన్
దనిపెన్; నీ వపు డిప్డు డొక్కఁడ వపస్థల్ మాత్రమే భిన్న; మి
త్రను వెత్తం గల కట్టిభేదము లె సీతారామచంద్రప్రభూ! 58

మ. తనకర్మమ్ము భుజింపకుండ నెవరుం దప్పింపలేరు నీ
ఘనచారిత్రమె సాక్షి దీనికయినన్ గాసిం బడం జాల కి
ట్లను లాపించెద నిన్నుఁ బొందినను నా కాకర్మసూత్రంబొ? దం
డన యిక్కట్లకే? బ్రోవ రాఁగదవె సీతారామచంద్రప్రభూ! 59

మ. ప్రజ నారాధనసేయు టన్న విగులన్ రంజిల్లు నాబుద్ధి, నన్
ఋజుమార్గంబునఁ ద్రిప్ప నెంచినను ధర్మిం గూర్పు భోగంబులన్;
స్వజనశ్రేయము నీమహార్చనము; తత్స్వధర్మముగన్ నిల్పఁగాఁ
దృఢియింపన్ దొరఁకొంటి వేయును సీతారామచంద్రప్రభూ! 60

మ. ప్రణుతోద్యోగమునన్ దనూసనమనఃప్రాణంబు లర్పించి త
త్ప్రణవాకారు నినున్ భజింప నటచేత న్ముక్తి చేకూరు; రా
వణు నిన్ దాఁకి జటాయు వాక్షితిజఁ గావన్ నీకునై ప్రాణి త్వ
ద్గణుతిం బొంది తరింపలేదె మును? సీతారామచంద్రప్రభూ! 61

మ. భ్రమ మున్ హేమమృగంబు నిన్ బలె నన్ బల్బాసులం బెట్టెడున్
శ్రమ లింకేను సహింపలేను విమలజ్ఞానేషువున్ నాకు వే
గముగా నిచ్చిన దానిఁ ద్రుంచి కడు వేడ్కం బొందుమున్ నిన్ను డెం
దమునం గొల్వఁగ నోపుదుం బిదప సీతారామచంద్రప్రభూ! 62

మ. సతము న్మోహవనంబునం దిరుగు, చాశాశాఖల న్బ్రాఁకు, చు
ద్ధతిమై జవ్వని గబ్బిగుబ్బకవపై దాఁట న్విజృంభించు నా
మతి యన్గోఁతిని నీదువాహనముగన్ బన్నించి మన్నింపు మున్
దతలాంగూలిబలమ్ము నేలవో? సీతారామచంద్రప్రభూ! 63

మ. సరదార్లై నినుఁ గొల్తు రం చయిన వాత్సల్యంబున న్మాదు పే
దఱికంబుం బెడఁబాపి, భాగ్యమును బొందం జేయు మోయయ్య! నీ
సరివాఁ డౌటకె కాదె కోఁతికిఁ భవిష్యద్బ్రహ్మపట్టంబు స
త్వరతం గూర్పఁగనుంటి వర్మిలిని సీతారామచంద్రప్రభూ! 64

మ. హనుమంతుం డ్బలె నీపదాబ్జయుగళి న్హస్తంబులం బూనుచుం,
గనుదోయిం దమి నద్దుకొంచు, మఱి వక్షస్సీమ నానించి, త
ద్ఘనసౌరభ్యముఁ గ్రోలి, నాశిరము మీఁదం దాల్చి హర్షంబుతోఁ
దనర న్నా కొనగూడు టెన్నఁడొకో? సీతారామచంద్రప్రభూ! 65

మ. అనుసంధించితి పక్కసంబు భవదీయ శ్రీభుజద్వంద్వ మ
త్యనురాగమ్మునఁ జాఁపి, జ్ఞానమును, సౌఖ్యంబుం బ్రసాదించితిం
గొనుమంచుం బవమానసూనుని బళా! కొండాటకు న్మన్కి యా
తని జన్మం బది యీసుఁ గొల్పఁగాకో? సీతారామచంద్రప్రభూ! 66

మ. హనుమద్భక్తుని భూమిజారమణి మాయాసన్నిధిం జేర్చి చెం
తను దత్త్వాత్మఁడ నీవు సాక్షి వగుచుం గన్గొంచు నద్వైతబో
ధన మాయం బిక చేత నాతనికి మోదం బొప్పఁ జేయించి యా
తని ధన్యాత్మునిఁ జేసి తీవు మును సీతారామచంద్రప్రభూ! 67

మ. రిపు లొంటించుచు నున్న బాధ లిఁక సైరింపంగలే, నీవు ము
న్నిపినాహ్వానమునందు నొంటెనపుహాపేక్ష న్వలె న్మించి య
త్యుపహాస్యమ్ముల పాలొనర్చితివి మదీయంబైన జన్మంబుః ము
త్తపస నీసత్కృప లేక యెట్లుగలు? సీతారామచంద్రప్రభూ! 68

మ. తనుపోషంబు బయ లాగ్గు రింద్రియగణద్వారప్రదేశాల వెం
టను వేవేగపు వొచ్చి జ్ఞాన మణుఁ త్నజ్యోత్స్న మాయాపటం
బున నాచ్ఛాదన చేసెఁ; రాత్మకు సహా! మోసం బిఁక కెట్లో మొదో?
ధనురాచార్యుని నిన్నుఁ జేరితిని సీతారామచంద్రప్రభూ! 69

మ. "ఘటముల్ గొమ్మ వెయాగభోక్త వగునో స్వామీ! భవత్ప్రీతిగాఁ
బలుపాటుల్ పడి తెచ్చి యిచ్చితిఁ, దరింపం గంటి దత్త్వంబునం
గలయంగా సెలవా?" యటన్న శబరిం గైవల్య మొందింపవే!
తలఁతు న్నా కొనగూర్పు మా సుఖము సీతారామచంద్రప్రభూ! 70

మ. అల సుగ్రీవున, కవ్విభీషణున కౌరా! రాజ్యముం గట్టి తీ
వెలమి న్మతుగ్రసహం బొసర్చుటయు నెంతే ముఖ్యమా; నీకు ని
ర్మలధర్మంబున నెంత పట్టుదల! నీమాహాత్మ్య మే మందు! భూ
తలమం దిట్టిది యున్నఁ డేఁ గలదె? సీతారామచంద్రప్రభూ! 71

మ. ఉడుతం బోలిన యల్పజీవి నగు నాయుద్యోగ మీక్షించి, ము
న్నడరన్ దాని మెయిన్ సువర్ణముగఁ జేయం జాలిఁగొన్నట్లె యి
య్యెడ నాయజ్ఞమునందు నాథవము నెంతేనిన్ సువర్ణస్ఫుర
త్తడిదుద్దీప్తిఁ జెలంగఁ జేయఁగదె సీతారామచంద్రప్రభూ! 72

మ. శిలలన్నీటను దేల్చెఁ, గోఁతులకు నుష్ణీషంబులం గూర్చె, ది
వ్యలసద్బోధముఁ గట్టలం దుడుతలం గావిర్భవింపించె నీ
యలఘుప్రాభవశక్తి, యట్టి దిఁక నాప్రార్థము న్మార్చి చి
త్కలితానంద మెలర్పఁజేయదొకో? సీతారామచంద్రప్రభూ! 73

మ. కడలి న్నీకడకంటిచూడ్కిఁ గొన కుగ్రస్ఫూర్తిఁ రావించి, మ్రి
క్కడి యా రావణుఁ ద్రుంచి భూమితనయం గైకొంటివి; షడ్డంకి యె
క్కడ నీదీక్ష కహో! మహాత్మ్యప్రాభవల్ గా సర్వసిద్ధంబు, లా
తఁడె స్వాతంత్ర్యపరాయణుండుగద! సీతారామచంద్రప్రభూ! 74

మ. కృప నీ కెప్పుడు వచ్చునో యని నిరీక్షింతు న్సదా, నీవు మున్
రఘుసోదర్యుని నవ్విభీషణునిఁ గూర్మిం బ్రోచుటన్; నన్ను నిం
కిపు డేనిం గృపఁ జూడ వేమిటికొ యిస్సీ? నిన్ను మ్రొక్కంగ హ
స్తపుటంబుల్ తెగఁగోయఁగావలదు సీతారామచంద్రప్రభూ! 75

మ. సెన రీ పూన శిరీషపేశల మొహో! నీమానసం బద్ది మా
కనుకూలించును గాక! శత్రువులపై నత్యాగ్రహం బీవు చెం
దిన వజ్రప్రతిమాన మౌర! యది మద్విద్వేషులం బొంది త
ద్ఘనగర్వంబు నడంచుఁ గాక యిఁక! సీతారామచంద్రప్రభూ! 76

మ. పటుసంకల్పబలంబె యున్న నొనరింప న్వచ్చు శీఘ్రంబ యెం
తటి కార్యంబుల నైన నిట్లె, లసయంత న్వచ్చు సాహాయ్య ము
ద్భటమై; సత్క్రియలోన నీకళలు స్నిగ్ధస్ఫూర్తి నుంట న్మహో
త్కటవిఖ్యాతికి మూల మౌ నదియె సీతారామచంద్రప్రభూ! 77

మ. ఫలితంబుల్ భవదర్పితంబు లగుచోఁ బ్రారంభసమ్యగ్గతుల్
విలసిల్లున్ జయలక్ష్మి నొంది మహిజావేణిం గలాపంబుగా
లలి సంధింపఁగ మత్ప్రయత్నసుమమాల్యంబు న్సమర్పించితిన్
దళుకుల్ గుల్కెడు నీదుపాదముల సీతారామచంద్రప్రభూ! 78

మ. పృథివిన్ స్వోదరపోషణార్థినయి వారి న్వీరి నర్థింపఁగన్
వృథగాఁ గ్రిమ్మరుచుంటి నీభజన నే నింతే నొనర్పం గటా!
ప్రథితప్రాక్కృతమామకీనసుకృతప్రాగల్భ్య మీ వెంచి స
త్పథముం జేర్పవె కూర్మి న న్మనిచి సీతారామచంద్రప్రభూ! 79

మ. తనువే ముఖ్యము ధర్మసాధనముఁ గాదా? కావునన్ దానిఁ బెం
చనె భాగ్యమ్ముల నెల్ల నిమ్మ; తొలుత న్నారూప్యముం బొంది మీఁ
దను సాయుజ్యము నందెద న్నిజముగాఁ దత్త్వార్థ మట్లైననే
తనరారున్ శ్రుతిశాసనం బిదియె సీతారామచంద్రప్రభూ! 80

మ. ఎఱుఁగ న్నే నిహసౌఖ్య మొందుటకు ని న్నేమేమి వాంఛించుటో
కొఱఁతల్ దీఱవు, బాధ తగ్గ, దొరులం గోరంగ నాస్తిత్వమే
పారయున్ ఛీ! వృథ యయ్యె నాబ్రతుకు; సన్పోషింప నీ వుండఁ జే
దఱికం బొందుటి దేటిపాప మొకో? సీతారామచంద్రప్రభూ! 81

మ. మతి నిన్ ధ్యాన మొనర్ప, వాక్కులు నుతింపం, బాణు లర్చింప, మ
చ్ఛ్రుతియుగ్మంబు భవత్కథల్ వినఁగ, నక్షుల్ నిన్నుఁ జూడంగ ధ
న్యత నొందుంగద యింక నేమిటికి సన్యగ్రంథపారాయణో
ద్యతవిభ్రాంతి? తొలంగఁజేయు మది సీతారామచంద్రప్రభూ! 82

శా. నది వార్ధిన్, లత వృక్షము, న్సతి పతి న్బ్రాపించునట్టుల్ భవ
త్పదపంకేజములందె నామదిని నిల్వం జేయుమా నిన్నె వేఁ
డెద భక్తావనదీక్షితుండ వగుటన్ డెందమునన్; "వాంఛితా
ర్థద! మాం పాహి నిరంతర" మ్మనుచు సీతారామచంద్రప్రభూ! 83

మ. కలిసం బయ్యె దరిద్రజీవితము లోకం బందు నేఁ డక్కటా!
జఠరాపూర్తికి భుక్తి, ధారణకు వస్త్రం బీపయిం గూర్చి ని
ర్ఘలితస్వాంతుల జె పౌరు లైవెలయుటన్ రూపించి, దీపించి త్వ
ద్ధతవాదిత్వము నిల్పుకోఁ గలయు సీతారామచంద్రప్రభూ! 84

మ. ప్రతిసం బూనితి వౌఁ! ధర్మమును సంరక్షింప; నేఁ డేమొ త
త్ప్రతిభం జూపవు, మొఱ్ఱల న్వినవు, చేరందీయ వీదీనుల
న్వ్రత మేమైనది? దుష్టసంఘము ల దుర్వారంబుగా రెచ్చె ను
ద్ధతులై, వారిని ద్రుంప వేమిటికి? సీతారామచంద్రప్రభూ! 85

మ. సకల న్నిల్పఁగ రామరాజ్యమహిమ న్మాయాంధ్రరత్నంబులం
బురికొల్పంగదె రామదండుగను సంపూర్ణాపవర్గాప్తి కు
ద్ధురదీక్షం బనిసేయ; ము న్నిటనె నీకోళ్ళక్తిమై రాక్షసో
త్కరముం గూల్పవె? మన్నవే ఋషుల? సీతారామచంద్రప్రభూ! 86

మ. పరదాస్యాసవఘూర్ణితార్యజనతాస్వాతంత్ర్యతత్త్వోన్నతిన్
బరిరక్షించుకొన న్సమర్థతను నాపాదింపవే, నీవె మా
శర; ణిం కెట్టు లనుగ్రహించెదవొ? మాసంప్రార్థనల్ వింటె; నీ
దరికిం జేరినమమ్ము వీడకుమ సీతారామచంద్రప్రభూ! 87

మ. అధికారుల్ పరదాస్యమత్తు లయి మర్త్యశ్రేణి నొప్పించి తా
మధికారుల్గఁ జరించుచుండు రిటు సహ్యం బెట్టు లౌఁ? నీమహా
కథ యివ్వారి కెదేవిధంబుగ నెఱుంగం జేసి వారి న్భవ
త్ప్రథితారాధనదీక్షులం జలుపు సీతారామచంద్రప్రభూ! 88

మ. వ్యసనోగ్రాహివిషప్రమత్తతఁ బ్రజావ్రాతమ్ము మూర్ఛ న్మునిం
గి సమాజ్ఞ న్విడనాడి కొట్టుకొనెడున్ క్షపింబ పోవ న్సమం
జస మా; మాంత్రికమాళి వీ, విటు లుపేక్షం జేసిన న్మీఁద సం
తస మే మున్నది నీకుఁ? జెప్పఁగదె సీతారామచంద్రప్రభూ! 89

మ. ఇటు నన్నగ్నిపరీక్ష సేయుటను నే నేపాటివాఁడ, న్సహిం
చుటకుం జాలను, నీవు నీసతియెడం జూపించు ప్రేమంబులో
నెటులే నించుక నాపయి న్నెఱపి నా కీజన్మసౌఖ్యమ్ము నిం
తటితో నైనను బూర్తి సేయఁగదె సీతారామచంద్రప్రభూ! 90

మ. పరివారమ్ము సుతుల్, గృహమ్ము తను వౌ, భాగ్యోపభోగమ్ము ని
ర్భరపూజావిధి, సత్సమాధి యగు నిద్రాముద్ర, వాక్యాల్ స్తుతుల్,
తిరుగం బూనుటయే ప్రదక్షిణము, చింతింపంగ నీ వాత్మ వి
త్తతి నేఁ జేయుపనుల్ త్వదర్చనమె సీతారామచంద్రప్రభూ! 91

వ. తట మంభోహృతుఁ, డశ్వగుండు తరు, వుద్యద్వ్యాప్తిభీతుండు ముం
దటి గేహం, బతిథుల్ గృహిన్, బ్రభుని దీనశ్రేణి, శీతార్తులు
త్కటవహ్నిం, దిమిరాకులుల్ దివియ నొందన్ హర్ష మెం తబ్బు నం
తటి మోదం బిడు మాత్మ నిన్గొలుతు సీతారామచంద్రప్రభూ! 92

మ. సరసీజాకరము న్మరాళము, ఘనం బర్హింబులు, న్జాతకో
త్కర మబ్దంబు, శశి న్జకోరములు నాకాంక్షించు లీల న్మదం
తరముం జిత్సుఖమన్యకేవలసుఖానందప్రదం బైన త్వ
ద్వరపాదాబ్జయుగంబుఁ గోరెడిని సీతారామచంద్రప్రభూ! 93

మ. వనజాతాప్తుఁ డొకండె తా క్షితినభోవ్యాప్తాంధకారం బడం
చు నెడం, గోటివిభాకరోజ్జ్వలుఁడవౌ చుం దోఁచు నీ కెంత న
న్ననయంబుం గిటికొన్ తమం బడపు టన్నా! సుప్రసన్నుండవై
దనరం జేయవె నన్ను నిత్యమును సీతారామచంద్రప్రభూ! 94

మ. పటుగాంభీర్య మగడ్త, ధైర్యము మహాప్రాకార, ముద్యద్గుణ
చ్ఛట సైన్యంబు, హృషీకముల్ గతులు, విజ్ఞానంబు సామగ్రి, హృ
త్పుటదుర్గంబున; కందు నీవు సతితో భోగంబులం బొందు మ
త్కటహర్షంబును నాకుఁ గూర్పఁగదె సీతారామచంద్రప్రభూ! 95

మ. నిను ధ్యానించుచు, నీపదాబ్జయుగముఌ నిత్యంబు సేవించుచున్
నినుఁ బ్రార్థించుచు, నీకె దిక్కనుచుఁ దండ్రీ! నమ్మినన్ సన్మనమందుఌ: నను నీ యపారకరుణ న్మన్నించుచుఌ సౌఖ్యా
ధనమున్ నాకు ననుగ్రహింపఁగదె సీతారామచంద్రప్రభూ! 96

మ. తతసారూప్యము నీసమర్చనను, ద్వైతాత్మసామీప్యమున్ నీదు సం
స్తుతి, సాలోక్యము నీదుభక్తతతితో సంపొందుసద్గోష్ఠి, నూ
ర్జితసాయుజ్యము నీదుధ్యానమునఁ దండ్రీ! పొందియుంటన్ గృతా
ర్థత నే నందితి నిశ్చయంబునను సీతారామచంద్రప్రభూ! 97

మ. తనలోభాదిగుణాళిచే నొరులవిత్తంబుల్ హరింపంగ మ
న్మతి యఌ తస్కరి యర్థనాథులధామంబుల్ ప్రవేశింపఁ గు
త్సితమార్గంబులఁ బట్టి పోయెడు; నెటుల్ శిక్షింతువో దీనిఁ దు
ష్కృతిభఌ? సత్ప్రభుమౌళి వీవుగదె! సీతారామచంద్రప్రభూ! 98

మ. అధికాశాప్తిని, దుష్టభూపతులగేహద్వారదేశంబులన్
వ్యథ లొందించుచుఁ జావుపుట్టువుల నూటాడించుసంసారముఌ
విధివార్థిల్ దప్ప నటంచు మానుపవొ నన్ వేధింప కింకైనఁ ద్వ
త్పథముం జేరుపవయ్య మ్రొక్కెదను సీతారామచంద్రప్రభూ! 99

మ. వెలినో, యింటనొ, నీటనో, గుహనొ, పృథ్వీభృచ్ఛిరంబందొ, కా
నలనో యెందొ తపింప నేమి యగు? డెందం బెప్పుడున్ నీపదం
బుల నెవ్వాఁడు లగించునో యతఁడె యొప్పన్ దివ్యయోగీంద్రుఁ డై
తలఁపంగా సుఖి వాఁడె సత్యముగ సీతారామచంద్రప్రభూ! 100

మ. తెలియంజాలక నీగుణం బొరుల నెంతే దేవురించుఌ జడుం
డల శుక్తిఌ రజతంబుగా, మణిగఁ గాచాశ్మంబుఁ, బిష్టోదకం
బుల క్షీరంబుగ, నెండమావుల జలంబుల్ గాఁగ భావించి యు
త్తలపాటుం గనునట్లు తత్తఱిలి సీతారామచంద్రప్రభూ! 101

మ. వటువో, గేస్తొ, వనస్థుఁడో, జటియొ యెవ్వాఁ డైనఁ గానిమ్ము ము
చ్చటగా నీకు స్వచిత్తపద్మ మిడినన్ సంసారభారంపులం
పట యవ్వానికిఁ గాక యుండునటు మోవంబూని నీ విత్తు వు
త్కటసౌఖ్యంబు నజస్రముం గరుణ సీతారామచంద్రప్రభూ! 102

మ. వనులన్, శైలములన్ జనుండు జడుఁడై వర్తించెడుం బూజసే
య నినుం బూవుల సేకరించుట కహో! స్వాత్మారవిందమ్ము నీ
కొనరం దా నిడి సుస్థిరంబుగను నీయొద్దన్ నిలన్ లేఁడు వం
తను గొట్లాడుచునుండు మాటికిని సీతారామచంద్రప్రభూ! 103

మ. ప్రభు నీ వొటనె దీనబాంధవుఁడ నై భాసిల్లుచున్నావు, దై
న్యభృతాంతఃకరణుండ నేను, మనబాంధవ్యంబు భవ్యంబు; నా
కభయం బిచ్చి దొసంగులన్ సయిఁచు టయ్యా! బంధుమర్యాద; త
త్ప్రభవానందము నా కొసంగు మిఁక సీతారామచంద్రప్రభూ! 104

మ. కపి నే దానికిఁ గోర మూనెదుగఁగన్ గాఢంపుసద్భక్తి ని
న్నెపుడుం గైకొని వీడకుంటి; నిటుపై నీవే కృపన్ నన్ ఓడా
లపుడింభంబువిధాన సాఁకవలె, నీలా గీ వుపేక్షించి హా!
తపనం బందునఁ ద్రోతువో కొ— నను సీతారామచంద్రప్రభూ! 105

మ. ఫలసంసిద్ధికి దేవ్వరించుచు నహంభావమ్ముతోఁ గర్మముల్
సలుపన్ మోసముగాక తప్పు, దిది నిష్కామక్రియాధూర్వహుం
డల సామీరి సహించునే? యెరియఁజేయన్ లేదె లంకాపురిన్?
దలఁగుం గీడు భవత్సపర్యలను సీతారామచంద్రప్రభూ! 106

మ. తళుకుల్ గుల్కెడు తారహారమును సీతాదేవి మున్నీయ, నం
దొలయుంబోవదు నీదు తత్త్వ మని తా నొల్లంగఁబో, కింత లిం
తలుగాఁ ద్రుంపఁడె వాయునందనుఁడు? సత్కారమ్ము సుస్థాయియై
తలఁపుం దన్నుకయున్నచో వృథయె సీతారామచంద్రప్రభూ! 107

మ. అనువర్తించుచు నాంజనేయుఁ డతిభృత్యత్వమ్ముఁ జూపింప, సీ
తను వామాంకమునందు లాలనల నుద్యత్ప్రీతి నొందించు నీ
ఘనతత్త్వాకృతి సేనె యంచు నెఱుఁగంగా నేర్తు నద్వైతత
త్త్వనిరూఢాత్ముఁడ నౌటఁ దీర్ఘకృప సీతారామచంద్రప్రభూ! 108

మ. ప్రజ దేవుండ నటంచు నెందనుక నిర్భావించు నద్వైతత
త్త్వజయశ్రీ విలసిల్లు నందనుక మన్మత్తేభదానోల్లస
త్సుజనేందిందిరకందళోత్కరము సంతుష్టాత్మతం గ్రమించుఁ గా
త! జగన్మాన్యగసజ్జలోత్సుకత సీతారామచంద్రప్రభూ! 109

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః



శా. “అంకం డీశ్వరుఁ డెందు సంస్కరణమాయాన్వర్తి? వమ్మయ్యె శే
షంకాలేపనవిధమ్ము మున్నె; యిటుపై స్వాతంత్ర్యతత్త్వమ్ము వ
స్తుంకార మ్మొనరించుటే శుభద” మంచున్ సత్యముం దెల్పు శ్రీ
శంకాటావన! హేమశైలభవనా! శ్రీసత్యనారాయణా!

చ. పలుకుడు లేలఁ నాదు ప్రతిపద్యము శాసనరాజమే సుమా,
ఫలకము నిర్మలం బగుచు భాసిలు మానవజాతి జిహ్వయే;
లలితరసప్రసంగతిఁ జెలంగు జగమ్మునయందు నద్ది; చు
క్కలగుమి మింట నెందనుకఁ గ్రాలునొ యందనుకన్ వెలుంగుచున్

